అవగాహన లేకపోవడంవల్ల వచ్చే తిప్పలు ఇవి. వాటిలో మచ్చుకు కొన్ని మనవిచేస్తాను.

## తప్పొప్పుల తబ్బిబ్బులు

వీటిని స్థూలంగా పన్నెండు రకాలుగా విడగొట్టవచ్చు:
అక్షరాల్లో – పదాల్లో – పదబంధాల్లో – వాక్యాల్లో – 'బడు' ప్రయోగాల్లో – యత్తదర్థకాల్లో – కలగాపులగం శైలిలో – పాతమాటల ప్రేమతో – ఏసలు చేసే మోసాల్లో – ఆకట్టుకోవాలన్న ఆత్రంలో – చేతినే కాని చెవిని ఒగ్గని తొందరపాటులో – తను రాసిందాంట్లో తప్పులున్నాయేమో చూసుకోడం నామోషీ అనిపించి.

వీటిలో మొదటి నాలుగు అంశాల కింద వచ్చే ఉదాహరణలను రెండు వరసల్లో ఇస్తున్నాను. మొదటి వరసలోవి: 1994 ఆగస్టులో ఆంధ్రప్రభ వారపత్రికవారు నిర్వహించిన జన్మదిన కథల పోటీకి వచ్చిన కథల్లో (సుమారు 445)వడబోతలో చివరికి మిగిలిన 35 కథల్లో (రాతప్రతుల్లో) కనిపించినవి. రెండో వరసలోవి: మెట్రిక్యులేషన్‌నుంచి తెలుగు ఎం.ఏ. స్థాయివరకు పరీక్షలకు కూర్చున్న విద్యార్థులు తమ సమాధాన పత్రాల్లో చేసిన తప్పులను ఏరి ఆంధ్ర విశ్వవిద్యాలయంవారు 'ఎం. ఆర్. అప్పారావు కమిటీ నివేదిక (1974 ఫిబ్రవరి)' లో ఉదాహరించారు; వాటిలోంచి తీసుకున్నవి.

| వరస 1 | | వరస 2 | |
|---|---|---|---|
| 1. అక్షరాల్లో: | | చలికత్తె | వివాదగ్రస్థము |
| ధౌర్భాగ్యం | అబద్దం | త్రాసుపాము | కృష్ణుడు |
| మద్యాహ్నం | మానశిక | ద్వేశము | సమశ్య |
| ఒల్లు | ప్రయాణీకులు | ప్రాదాన్యత | ఉచ్ఛరించు |
| | | కృషించు | శ్రేష్టము |
| | | విసిదీకరించి | స్వేఛ్ఛగా |
| | | సరస్పతి | సిష్యుడు |
| 2. పదాల్లో/సమాసాల్లో: | | అందవంతుడు | తెలివివంతులు |
| ఉపహోరం | శాఖాహోరి | నదీనీటిని | పొగడ్తనీయము |
| తారాస్థాయి | సాంప్రదాయం | నిశీధిచీకటి | గుండెనిబ్బరుడు |
| [సంఖ్యం]సాప్తపదీనం | సూరుడు | గొప్పనీయుడు | మంచిత్వము |
| ప్రొద్దునే | అవ్వాళ | రెండవోపయోగము | వర్షలేమి |

| | | | |
|---|---|---|---|
| ఫోజు | క్రాప్పు | పంటోత్పత్తి | ధనఆకిము |
| పరిష్వాంగము | ఈర్ష | అత్యందగాడు | అందపిపాస |
| నిరాశమయం | ఇపుడు | ప్రియయుంపుడుగత్తె | జీవయూాట |
| | | ద్రౌపతి | అర్ణఖాండము |
| | | ఉృద్ధి | విషధీకరించు |
| | | పట్టమహార్షి | పాక్షాత్యులు |
| | | వినోదార్తము | సీగ్రముగా |

3. పదబంధాల్లో:

| | | | |
|---|---|---|---|
| మండిగంకి | పటిష్టమైన | నిష్పలమైన | తిరుగుచుంటే |
| వ్యాపారంకై | పడ్తుంటాను | లెగవలేదు | పంపింస్తాడు |
| గాంభీరంగా ఉంది | ఫీలవ్వుతుంటాను | తెలుచుకొని | దయార్ధహృదయముతో |
| సచ్చుబడిపోయి | కల్గించడం | క్రొంత తడవున | కూడుగ్రుడ్డలకు |
| పీడుస్తుంది (వర్త.కాలం.) | | హాస్తమించెను | వంపుడుకత్తితో |
| ఆదర్శిప్రాయంగా | చూస్తోంటే | | |
| వొంటికి | చూసాను | | |
| కృంగిపోతూ | వెల్తుండగా | | |
| నీర్చంగా | కటువైన | | |
| చూచుకొని | కాళరాత్రియైంది | | |

| వరస 1 | వరస 2 |
|---|---|
| 4. వాక్యాల్లో: | |
| .....వుద్యోగం రావడమూ | కనులు మూసి హాయిగా దీర్ఘనిద్ర నిద్రించెను. |
| .....పెళ్ళీ జరిగింది. | గాధాసప్తశతియే శుకసప్తతి సప్తశక్తి. |
| | దుశ్శాసనుడు ద్రౌపతి వస్త్రాభరణము చేసెను. |
| | అమెరికా, లండన్ మున్నగు దేశములు ఐశ్వర్యములో మ్రుగ్గుచున్నవి. |
| | చైనావారు భారతదేశము దండెత్తుట శ్లాఘనీయము. |
| | తుంగభద్ర భద్రాచలములో గలదు. |
| | ప్రాజెక్టులు ఎక్కువగా నిర్మాలించవలెను. |
| | నిరుద్యోగ సమస్య ప్రణయనృత్యము చేయుచున్నది. |
| | మొల్ల అనువాదు రామాయణము వ్రాసెను. |
| | మిసిసిపి భారతదేశ పుణ్యనదులలో ఒకటి. |

పోతన కవిత్వము చక్కగా నారికేళ పాకమువలె ఉండును.
కృష్ణానది దవిళేశ్వరమువద్ద పుట్టి సర్వ పాడి పంటలు అత్యంత డెల్టాలో పండును.

5. 'బడు' ప్రయోగాల్లో:

మన వాడుక భాషలో సాధారణంగా వాక్యంలో కర్తకు ప్రాధాన్యమిచ్చి చెప్పడమే సహజమయిన పద్ధతి. కర్మకు ప్రాధాన్యమిచ్చి చెప్పే పద్ధతి సంస్కృతం, హిందుస్థానీ, ఇంగ్లీషుభాషా ప్రభావాలవల్ల వచ్చినదే. 'వంట అయింది' అన్నప్పుడు కర్తకే ప్రాధాన్యముంది. 'వంట చేయబడింది' అన్నప్పుడు కర్మకు ప్రాధాన్యముంది (చేయన్+పడు=చేయబడు). 'అన్నం తిన్నాను' అంటాం కాని, 'నాచేత అన్నం తినబడింది' అనం. 'Pure ghee sold here' అన్న ప్రకటనకింద 'ఇచ్చట స్వచ్ఛమయిన నెయ్యి అమ్మబడును' అన్న తెలుగు ప్రకటన కూడా కనిపిస్తూ ఉంటుంది. మక్కికి మక్కిగా చేసే అనువాదాలవల్ల సహజమయిన తెలుగు పలుకుబడి చచ్చుబడిపోతోంది. ఇది ఎంతవరకు వెళ్ళిందంటే, 'వంటబ్రాహ్మలు దొరకబడును' వంటి ప్రకటనలను కూడా పుట్టిస్తోంది! మరీ చేతకాని సందర్భాల్లో ('కర్మ'కు ప్రాధాన్యమివ్వకపోతే కొంప మునిగి పోతుందనుకుంటే) తప్ప మన భాషకు సహజమయిన పద్ధతిలోనే వాక్యాలు రాయడం మంచిదికదా!

6. యత్తదర్థకాల్లో:

'నన్ను ఎవరయితే పిలిచారో వారు మా ఆఫీసరుగారు'.
'నా దగ్గర ఏదయితే ఉందో అది నీకు ఇస్తాను.'

వీటిని యత్తదర్థక వాక్యాలు అంటారు. ఇవి మనకు సహజమయినవి కావు.

'నన్ను పిలిచినవారు మా ఆఫీసరుగారు.'
'నా దగ్గర ఉన్నది నీకు ఇస్తాను.'

ఇవి మనం మామూలుగా ప్రయోగించే వాక్యాలు. పోతనగారు చేసిన "ఎవ్వనిచే జనించు......వాని నాత్మభవు నీశ్వరు......." వంటి ప్రయోగాలు కవిత్వానికే పరిమితం కావడం సహజం. వాక్యానికి బలం చాలదనుకొన్నప్పుడు యత్తదర్థకవాక్యాలు విరళంగా రాస్తే బాధ లేదు.

7. కలగాపులగం శైలిలో:

వాడుక భాషను సరిగా గ్రహించనివాళ్ళూ కావ్యభాషా ప్రభావంనుంచి బయటపడలేకపోయినవాళ్ళూ శైలిని కలగాపులగం చేస్తూ ఉంటారు:

'ప్రొయ్యి మండుతోంది. పక్కన పద్మిని కూర తరుగుచున్నది.' వాడుక భాషలో రాసిన వాక్యాల్లో ప్రాచీన కావ్యభాషారూపాలు ఎంత అసహజంగా ఉంటాయో పైవాటిలో గమనించవచ్చు. కావ్యభాషలో రాసినప్పుడు దానికి విరుద్ధమయిన రూపాలు రాయడం కూడా తప్పే మరి!

**8. పాతమాటల ప్రేమతో:**

'ఆ పాఠశాలలో రాత్రిపూట విద్యగరపుతారు'– అనడంకంటె '–విద్య నేర్పుతారు / చదువు చెబుతారు / చదువు నేర్పుతారు' అనడం సహజంగా ఉంటుంది. 'నిర్ణయంగైకొన్నారు' అనడం కంటె 'నిర్ణయించారు' అనడం సహజంగా ఉంటుంది. వాడుక భాషలో రాసేటప్పుడు 'వెండియు, పిమ్మట, మరియు, పలువురు' వంటివి తప్పించకపోతే శైలి కృత్రిమంగా తయారవుతుంది.

**9. ఏసలు చేసే మోసాల్లో:**

జీవద్భాషలో ఏసలుండటం సహజం. కొన్ని ప్రాంతీయంగా కనిపిస్తాయి; కొన్ని వర్గపరంగా కనిపిస్తాయి. రచయితలు కథనంలో కాని, పాత్రోచితమయిన సంభాషణల్లో కాని వాటిని చూపించదలుచుకున్నప్పుడు వాటిని శ్రద్ధగా విని వీలున్నంతవరకు ఉచ్చారణ విధేయంగా రాయకపోతే మోసపోయే అవకాశం ఉంది. మాటవరసకు, తెలంగాణాలో 'అన్నా'డు' అనే మాటలో నకారంమీద ఒట్టి దీర్ఘం రాసేస్తే (అన్నాడు) సరిపోదు. అర్థం మారిపోతుంది. మొదట సూచించిన విధంగా రాస్తే 'అన్నాడా?' అన్న ప్రశ్న స్ఫురిస్తుంది (పైసలియ్యనన్నా'డు?). నకారంమీద ఉన్న ఊనికను ఏదో ఒక గుర్తుతో సూచించకపోతే, "పైసలియ్యనని చెప్పాడు" అన్న అర్థం వస్తుంది.

ఈ మాదిరిగా ఒక్కొక్క ప్రాంతంలో ఉచ్చరించడంలో కాని ఊనిక ఇవ్వడంలోకాని ఒక్కొక్క విలక్షణత వాడుకలో గోచరిస్తుంది. దీన్ని గ్రహించకుండా రాస్తే తప్పులు రాకమానవు.

**10. ఆకట్టుకోవాలన్న ఆత్రంలో:**

చాలా సరళమయిన వాక్యాల్లో తేలికయిన మాటల్లో చెప్పగలిగిన విషయాన్నికూడా బరువయిన మాటతో క్లిష్టమయిన వాక్యాల్లో చెప్పడానికి ప్రయత్నిస్తూ ఉంటారు కొందరు. శైలిలో వైవిధ్యంకోసం అప్పుడప్పుడు కొన్ని బరువయిన మాటలు వేస్తే పెద్ద ప్రమాదంలేదు కాని, పాఠకుల్ని ఆకట్టుకోవాలన్న ఆత్రంలో అనవసరమయిన పదాడంబరం, వాక్యవిన్యాసం కనబరుస్తూ ఉంటారు కొందరు. చదువరులు సాధారణంగా తేలికగా ఉన్న శైలినే అభిమానిస్తారు; ఆదరిస్తారు. అప్పుడప్పుడు, విసుగుదల

కలిగించకుండా, తేడా చూపించడంకోసం రచయితలు చేసే ప్రయోగాల్ని హర్షిస్తారు. ఉదాహరణకు, పత్రికలో వేసే వార్తలో ఒక ప్రముఖ వ్యక్తి చేసిన ప్రసంగాన్ని ఇస్తున్నప్పుడు "...అని చెప్పారు," అని తరచుగా పునరుక్తి చేస్తూ ఉంటే చదివేవాళ్ళకు విసుగుపుడుతుంది. అందువల్ల, "....అని అన్నారు / అని ఉద్ఘాటించారు / .....అని ఉద్బోధించారు / .....అని వక్కాణించారు" అంటూ వేరువేరు రూపాలను పత్రికలవాళ్ళు ప్రయోగిస్తూ ఉంటారు. అంతవరకు బాగానే ఉంటుంది. కాని, ఏ పండితప్రకాండుల సాహితీ సదస్సులోనో వాడదగిన మాటలను సాధారణ పాఠకులకోసం రాసిన దానిలో తరచుగా ప్రయోగిస్తే ఎబ్బెట్టుగా ఉంటాయి. ఇది గమనించకుండా, కొంతమంది, మామూలు తెలుగుమాటలతో చెబితే సరిపోయే సందర్భంలో కూడా నోరు తిరగని, అర్థం తెలియని సంస్కృత పదాలనూ సమాసాలనూ ఇంగ్లీషు ఉర్దూ మాటలనూ విరివిగా వాడుతూ పాఠకుల్ని గాభరా పెడుతూ ఉంటారు. సులభసుందరమయిన శైలికున్న విలువ క్లిష్టపదభూయిష్ఠమయిన శైలికి ఒక్కనాటికి ఉండదు గాక ఉండదు!

### 11. చేతినే కాని చెవిని ఒగ్గని తొందరపాటులో:

తెలుగులో చక్కని శైలికి పేరుపడ్డ రచయితల్లో ఒకరు శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారు. ఆయన, సహజమయిన తెలుగు పలుకుబడిని, కండగల నుడికారాన్ని ఒంటబట్టించుకోడానికి, పల్లెటూళ్ళలో ఆడవాళ్ళు మాట్లాడేటప్పుడు శ్రద్ధగా వినేవారమనీ, వాళ్ళ సంభాషణల్లోనే చక్కని తెలుగు నేర్చుకొన్నామనీ అదే తమ రచనలకు ఉపయోగించుకున్నామనీ చెప్పారు. ఇక్కడ గమనించవలసిన విషయం— ముందు చెవి ఒగ్గి తరవాత చేతికి పని చెప్పారు. అందువల్ల ఆయన చాలా సహజమయిన చక్కని తెలుగులో రచనలు చెయ్యగలిగారు. అన్ని ప్రాంతాల రచయితలూ తాము విన్న, తమకు తెలిసిన నుడికారాలను ప్రయోగించి రచనలు చేస్తే తెలుగు భాషలో ఉన్న అందచందాలు అందరికీ తెలుస్తాయి.

రచయిత అన్నవాడు భాష జీవనాడి ఎలా స్పందిస్తోందో తెలియకుండా రాసుకుంటూ పోతే అతని రచనా నిలవదు; అతనూ నిలవడు. అలా కాకుండా, కాస్త నిదానించి వింటే, దాన్నిబట్టి రాస్తే అందరూ సంతోషిస్తారు.

### 12. తప్పులున్నాయేమో చూసుకోడం నామోషీ కొందరికి:

మామూలుగా, తప్పులు రెండు రకాలుగా దొర్లుతాయి: (1) తెలియక రాసే తప్పులు (2) తెలిసినా రాసిన తప్పులు. తెలియక రాసే తప్పులను గురించి ప్రత్యేకంగా చెప్పవలసింది ఏమీ లేదు. నిదానించి తెలుసుకొని

రాయడమే చెయ్యవలసింది. ఇక, రెండో రకానివి దొర్లడానికి కారణం, ఆలోచన సాగుతున్నంత వేగంగా చెయ్యి సాగకపోవడం. అది సహజం. కాని, రాసింది ఒక్కసారి మళ్ళీ చదువుకుంటే సులువుగా దిద్దుకోవచ్చు. తప్పులు దిద్దుకోడమే కాదు; రచనకు మెరుగులూ దిద్దుకోవచ్చు. ఈ కాస్త పని చెయ్యడం కొందరికి నామోషీ! "మనం రాశాక తప్పులేముంటాయి?" అన్న ధీమా కొందరికి! దాంతో, ఆ రచన అలాగే (అదనంగా కొన్ని అచ్చుతప్పులతో) అచ్చయిపోతుంది. ఇక చదివేవాళ్ళ అదృష్టం!

టాల్‌స్టాయి 'వార్ అండ్ పీస్' నవలను ఎన్నిసార్లు తిరగరాస్తే ఇప్పుడు ఈ రూపంలో ఉందో చాలా మందికి తెలియదు. మన తెలుగు రచయితల్లోనే మహీధర రామమోహనరావుగారి వంటి ప్రముఖ రచయితలు కూడా ఒకే నవలను ఎన్నిసార్లు తిరగరాస్తారో చాలామంది ఎరగరు. వారు రాసిన ప్రతి ఒక్క ప్రతీ శుద్ధప్రతిలాగే ఉంటుంది మరి!

రచనకు మెరుగులు దిద్దడానికి ప్రముఖులే శ్రమతీసుకొంటూ ఉంటే, ఇతరులు కనీసం రాతతప్పులు దిద్దుకోడానికయినా ప్రయత్నించవద్దా? కనీస ధర్మం కదా!

## పంచప్రాణాలు

రచనకు ప్రాణం పొయ్యవలసినవాడు రచయిత. విషయపరంగానూ భాషాపరంగానూ సంపూర్ణత సిద్ధిస్తేనే రచన జీవిస్తుంది.

భాషాపరంగా గమనిస్తే రచనకు పంచప్రాణాలవంటి అంశాలు ఐదు కనిపిస్తాయి :

సరళత స్పష్టత
క్లుప్తత జాతీయత
వాస్తవికత

పంచప్రాణాలు లేకపోతే రచయితా లేడు; రచనా లేదు. రచయితా రచనా ఉండాలనుకుంటే ఇవి ఉండాలి. రచయిత గతించినా రచన జీవంతమయి ఉండాలి!

(బెంగుళూరులోని కథావేదికవారి 'తెలుగు కథ వెలుగులు' సంకలనంకోసం రాసినది, ఫిబ్రవరి 1995)

★ ★ ★

# 16

# భారతీయ భాషలన్నిటికీ కలిపి ఏకలిపి అవసరమా?

జేబులోంచి రూపాయి నోటు తీసి చూస్తే, దానిమీద ఆ నోటు విలువ పదిహేను భాషల్లో కనిపిస్తుంది. ఇంగ్లీషు, హిందీ సరేసరి– మరో పదమూడుభాషల్లో కూడా ఉంటుంది. వాటి వరస ఇంగ్లీషు అక్షరక్రమంలో ఉంటుంది. లిపిమాత్రం దేనిది దానికే. కొంచెం జాగ్రత్తగా చూస్తే కొన్ని లిపులకు దగ్గరిపోలికలు కనిపిస్తాయి. అలాగే, తేడాలూ కనిపిస్తాయి. తెలుక్కీ కన్నడానికీ ఎంత దగ్గరి పోలికుందని! 'అ ఆ ఇ ఈ'ల వరకు దాదాపు రెంటికీ ఒకటే. కాని ఉకారంలో తేడా కనిపిస్తుంది. అలాగే హల్లుల్లో కన్నడ 'క'కారం 'త'కారం, 'య'కారం వగైరా కాస్త తేడాగా కనిపిస్తాయి. తమిళలిపికీ మలయాళ లిపికీ కూడా కొన్ని పోలికలు కనిపిస్తాయి. సంస్కృతం, హిందీ, మరాఠీల సంగతి చెప్పక్కర్లేదు; దేవనాగరి లిపిలోనే రాస్తారు. పైనుండే అడ్డగీతలు మినహాయిస్తే గుజరాతీ లిపి వచ్చేసినట్టుంటుంది. కొన్ని వంపులూ సొంపులూ ఎక్కువన్నమాట కాని, బెంగాలీ లిపి, అస్సామీ లిపి కూడా నాగరలిపిలాగే ఉంటాయి. ఉర్దూ, కాశ్మీరీ లిపుల తీరే వేరు. ఒరియా కూడా నాగరలిపి కన్న భిన్నంగానే కనిపిస్తుంది. మొత్తంమీద, ఆ లిపులన్నీ మనకి రాకపోయినా, ఏ లిపి ఏ భాషదో స్థూలంగా గుర్తుపట్టి చెప్పవచ్చు. అంటే లిఖితభాషను గుర్తుపట్టడానికి దాని లిపి ఒక ముద్రలా ఉపకరిస్తుందన్నమాట. అంచేత భారత రాజ్యాంగ చట్టం గుర్తించిన భాషలన్నిటిలోనూ రూపాయి నోట్లమీద వాటి విలువ అచ్చువేస్తుంటారు.

ప్రపంచంలో మొత్తం ఎన్ని భాషలు వాడుకలో ఉన్నాయో ఇప్పటికీ సరైన లెక్క తేలలేదు. సుమారు రెండు మూడువేల భాషలు ఉండొచ్చని భాషాశాస్త్రవేత్తల అంచనా. వాటిలో భారతదేశంలోనే కొన్ని వందలు ఉన్నాయట. 1910లో సర్ జార్జ్ గ్రియర్సన్, వెంకయ్య, ప్రొ. స్టెన్ కొనో గార్లు ప్రచురించిన లింగ్విస్టిక్ సర్వే ఆఫ్ ఇండియా సంపుటాల్లో, అప్పటికి భారతదేశంలో వాడుకలో ఉన్న భాషలూ మాండలికాలూ కలిపి సుమారు ఆరు వందలుంటాయని అంచనావేశారు. వాటిలో లేఖన సంప్రదాయమేర్పడి

అభివృద్ధి చెందిన భాషల్నే రాజ్యాంగచట్టం గుర్తించింది. ఈ లెక్కన, లిపి లేని భాషలు, లిపి ఉన్న భాషలకి ఎన్ని రెట్లున్నాయో ఊహించడం కూడా కష్టం. అంతెందుకు? తెలుగు, తమిళం, కన్నడం, మలయాళం సోదరభాషలనీ ద్రావిడభాషా కుటుంబంలోవనీ చెప్పుకుంటున్నామా! ఈ భాషాకుటుంబంలో ఉన్నవి ఇంతేనా మరి! ఇంకా ఉన్నాయి. పాకిస్తాన్‌లో కూడా మన ద్రావిడభాష ఒకటి ఉంది. దాని పేరు 'బ్రాహూయీ'. ఇవన్నీ నిన్నా మొన్నా పుట్టినవి కావు. ప్రతి భాషకూ కొన్ని వేల సంవత్సరాల చరిత్ర ఉంటుంది; కనీసం కొన్ని వందల ఏళ్ళ చరిత్ర అయినా ఉండి ఉంటుంది. దాన్ని మనం తెలుసుకోడం, తెలుసుకోకపోవడం వేరే విషయాలు. కొన్ని వందల కోట్ల ఏళ్ళ కిందట ఈ భూమి పుట్టి, కొన్ని లక్షల ఏళ్ళ కిందట మానవజాతి ఏర్పడినప్పుడు, మనిషితోబాటే కాస్త ఇంచుమించుగా భాషకూడా పుట్టి ఉంటుందనుకోడంలో తప్పులేదు. కాలక్రమాన, మూలభాషల్లో మాండలికాలు ఏర్పడ్డప్పుడు, ఆ మాండలికాలు పరస్పరం అర్థం కానంతగా వేరయిపోయినప్పుడు, అవే స్వతంత్ర భాషలుగా ఏర్పడతాయి. అలా వచ్చినవే ఇవన్నీ.

మొదట్లో నోటిమాటగా చెలామణీ అయిన భాషలు లేఖన సంప్రదాయం అలవడ్డ తరవాత రాతకెక్కుతాయి. అంటే, వాడుకభాష ప్రాచీనం; లేఖన సంప్రదాయం అర్వాచీనం అన్నమాట. మన వేదాలు నోటిమాటమీద జీవించినవే. వాటిని గ్రంథస్థం చేస్తున్నది ఇప్పుడిప్పుడు.

లేఖన చరిత్రద్వారా మనకి లిపి పరిణామం స్పష్టమవుతుంది. అత్యంత ప్రాచీనమైన ఆచారాల్లో మనకి మొదట కనిపించేది చిత్రలిపి. మనిషి మనస్సులో ఉన్న భావం కొన్ని బొమ్మలద్వారా వ్యక్తమవుతుంది. ఆ తరవాత కనిపించేది భావసంకేతలిపి. ఒక వస్తువు పేరుకు కాని, ఆ పేరులో ఉన్న అక్షరాలకు కాని సంకేతాలు ఉండడం కాదు– దాని భావానికి ఒక సంకేతం ఏర్పడి ఉంటుంది. ఆ తరవాత కనిపించేది విశ్లేషాత్మక లిపి. దీంట్లో ఒక మాటకొక సంకేతం చొప్పున ఉంటుంది. చైనాభాష లిపిని దీనికి ఉదాహరణగా చెప్పుకోవచ్చు. మరో రకం లిపులు– ధ్వన్యాత్మక లిపులు. ఇవి మళ్ళీ రెండురకాలు: అక్షర లిపి, వర్ణ లిపి అని. అంటే, సిలబిక్ స్క్రిప్ట్, ఆల్ఫబెటిక్ స్క్రిప్ట్ అన్నమాట. అక్షరలిపిలో ప్రతి సంకేతం ఒక అక్షరాన్ని సూచిస్తుందన్నమాట. ఇక్కడ అక్షరమంటే ఏకాచ్కం; అంటే 'సిలబిల్'. ఈ రకమైన లిపిలో ఒక పదాన్ని విభజించినప్పుడు వచ్చే కనిష్ఠప్రమాణం అక్షరమన్న మాట. 'రూపాయి' అన్న మాట రాసి చూసినప్పుడు దాన్ని

మూడు భాగాలుగా విభజించవచ్చు : రూ– పా– యి. ఈ మూడింటిలో ప్రతి భాగంలోనూ ఒక్కొక్క అచ్చు ఉంది. కనక ఈ మూడూ మూడు అక్షరాలు. మన దేశంలో సంస్కృతం, తెలుగు, కన్నడం మొదలైన భాషల లిపులు అక్షర లిపులు. వీటిలో ఒత్తులు, తలకట్లు వగైరాలు పైన, కింద, పక్కల చేరుతూ వస్తాయి. ఆ విధంగా ఒక్కొక్క ఏకాచ్చానికి ఒక్కొక్క సంకేతం ఉంటుంది. టైపు చెయ్యాలన్నా, అచ్చువెయ్యాలన్నా వీటితో పని ఎక్కువవపడుతుంది. అక్షర లిపికన్న వర్ణ లిపిలో మంచి సౌకర్యముంది. ఇందులో ఒక్కొక్క వర్ణానికి ఒక్కొక్క లిపి సంకేతం ఉంటుంది. అందులో ఒత్తులూ తలకట్లూ బెడదలేదు. రోమన్ లిపి అల్లాంటిది. తెలుగులిపిలో 'క' అన్న అక్షరం రాయాలంటే, తోకమీద లేచిన పాముమాదిరిగా వంకర గీత ఒకటి గీసి, ఆ పైన తలకట్టు పెట్టాలి. ఆ తలకట్టు 'అ' అన్న అచ్చుకు మారురూపం. 'క్+అ=క;' అదే రోమన్‌లిపిలో అయితే 'కె' (K) పక్కన 'ఏ' (A) రాస్తే సరిపోతుంది. తెలుగులో 'క' కి తలకట్టయినా ఉంది; జ,బ,ల, ఞ లకి అది కూడా లేదు. మొత్తంమీద అచ్చుల్లో అన్నిటికీ, హల్లుల్లో దాదాపు అన్నిటికీ – ప్రధాన సంకేతాలూ ఉపసంకేతాలూ రెండు రకాలుగా ఉంటాయి. రాసేవాడూ టైపుచేసేవాడూ అచ్చువేసేవాడూ వీటితో సతమతం కాక తప్పదు.

భారత రాజ్యాంగచట్టంలో గుర్తింపు పొందిన భాషల్లో చాలావాటికి వేరు వేరు లిపులున్నాయి. కొన్ని భాషల లిపులకు కొన్ని పోలికలు కనిపిస్తున్నా, కొన్ని తేడాలు కూడా ఉన్నాయన్న సంగతి విస్మరించలేం. వీటిలో, దాదాపు అన్ని లిపులకూ మూలం 'బ్రాహ్మీలిపి' అంటారు. భారతీయభాషలకే కాదు– ఆగ్నేయాసియా భాషలకు అక్షరభిక్ష పెట్టిందికూడా బ్రాహ్మీలిపేనని చెబుతూంటారు. మూలం ఒకటే అయినా కాలగతిలో పరిణామాలు రాకమానవు. అన్ని వ్యవస్థల్లో వచ్చినట్టే లిపివ్యవస్థలోనూ మార్పులు రావడం సహజం.

పోతే, ప్రపంచంలో ఇన్నివేల భాషలున్నాయి కదా, వాటన్నిటికీ ఒక్కొక్క లిపి ఏర్పాటయిపోతే గందరగోళం పెరిగిపోతుందని కొందరికి భయం. కాని భాషలెన్ని ఉన్నా లిపులు అన్ని లేవు. పైపెచ్చు ఏ లిపీ లేని భాషలే హెచ్చు. భారతదేశంలో దేవనాగరి లిపిలో రాసే భాషలు మనకి తెలుసు. అలాగే ఇంగ్లీషు, ఫ్రెంచి, స్వీడిష్, ఇటాలియన్ మొదలయిన భాషలు రోమన్ లిపిలోనే వ్యవహారం సాగిస్తున్నాయి. ఎటొచ్చీ భాషకు విలక్షణమయిన ధ్వనులున్నప్పుడు ప్రత్యేక సంకేతాలు ఏర్పరుచుకోవలసి ఉంటుంది. జర్మన్,

రష్యన్ మొదలైన భాషల్లో అలాటివి వాడుతూనే ఉన్నారు. అంతేకాదు, రోమన్ లిపిలోకూడా ఒకే సంకేతం ఒక భాషలో ఒక ధ్వనిని, మరో భాషలో మరో ధ్వనినీ సూచించే సందర్భాలు లేకపోలేదు. పైపెచ్చు, అక్షర రూపం తారుమారయిన సందర్భాలుకూడా ఉన్నాయి. రోమన్ లిపిలో 'ఆర్' అన్న సంకేతం రష్యన్ లిపిలో తారుమారుగా ఉంటుంది(దాన్ని పలికే ధ్వని కూడా వేరే). అంటే మామూలుగా R రాసి అద్దంలో చూస్తే ఎలా ఉంటుందో అలా ఉంటుందన్నమాట. ఇటువంటి తేడాలు బహుకొద్ది.

ఇంతకీ చెప్పవచ్చేదేమిటంటే– భాషలు వేరయినా ఒకే లిపి వాడడంలో బేసబబు లేదు. లేకపోగా, కొన్ని సౌకర్యాలున్నాయి. అదేమిటంటే– ఒకే టైపు మిషను చాలా భాషలకు ఉపయోగిస్తుంది. అచ్చులో టైపులు కూడా కొత్తగా పోత పోసుకోనక్కరలేదు. ఒకే లిపిలో చాలా భాషల పుస్తకాలు అచ్చువేసుకోవచ్చు. ఇతర భాషలు నేర్చుకునే విద్యార్థులకి ఆయా భాషల లిపులు నేర్చుకోవలసిన బెడద ఉండదు.

ఇల్లాటి సౌకర్యాలున్నందువల్ల భారతీయ భాషలన్నిటికీ కలిపి ఒక లిపి బాగుంటుందన్న ఆలోచన కొందరికి వచ్చింది. ఆలోచన బాగానే ఉంది. అమలుపరచడంలోనే ఉంది చిక్కు. ఇది సాధ్యమా, కాదా? సాధ్యమయితే, ఎప్పుడు? ఎలా? అన్న ప్రశ్నలుకూడా ఉన్నాయి. అంతేకాకుండా, ఏ లిపి ప్రవేశపెట్టాలన్నది అన్నిటికన్న పెద్దప్రశ్న.

ప్రభుత్వం తలుచుకుంటే ఏకలిపికేం కొదవ? ఒక శాసనం చెయ్యొచ్చు; ఒక తాఖీదు జారీచెయ్యొచ్చు. అంతమాత్రాన అది ప్రజల్లోకి చొచ్చుకు వెళ్తుందని చెప్పలేం. అందరి సంగతీ ఎందుకు? తెలుగువాళ్ళ సంగతే తీసుకుందాం. సుమారు ఐదారు కోట్లమందిలో చదువుకున్నవాళ్ళు కొంచెమించుమించుగా మూడోవంతు ఉన్నారనుకున్నా– తరతరాలుగా ఒక లిపికి అలవాటుపడ్డవాళ్ళు వీళ్ళు. ఒక్కసారి లిపి మార్చుకోవాలంటే సాధ్యం కాదు. రాతకోతలు సాఫీగా సాగవు. కనీసం ఒకటి రెండు తరాలవాళ్ళు బాధపడక తప్పదు. ముత్యాల కోవలాంటి తెలుగక్షరాలు వదులుకోడానికి సుతరామూ ఇష్టపడరు. పోనీ నయాన్నో భయాన్నో ఒప్పుకుంటారనుకుందాం. ఆ ఏకలిపి ఎల్లాటి లిపి? అక్షరలిపా? వర్ణలిపా? వర్ణలిపి అయితే రాతలోనూ అచ్చులోనూ సౌకర్యమున్న మాట వాస్తవం. కాని మన భాషలన్నీ దాదాపు, అక్షరలిపికే అలవాటుపడ్డాయే మరి! పోనీ అక్షరలిపే తీసుకుంటే, ఏది తీసుకోవాలి? అన్నీ బ్రాహ్మీలిపినించి వచ్చినవే కనక ఏది తీసుకున్నా పరవాలేదని చెప్పొచ్చు. కాని కొన్ని భాషల్లో ప్రచురమైన ధ్వనులకు కూడా సంకేతాలు లేవు.

తెలుగులో ఉన్న హ్రస్వ 'ఎ'కారానికీ, 'ఒ'కారానికీ దేవనాగరిలో సంకేతాలు లేవు. ఖ, ఘ వంటి మహాప్రాణాలకు, గజడదబలనే సరళాలకు తమిళ లిపిలో సంకేతాలు లేవు. తెలుగులోనే 'తాటాకు' లో ఉన్న 'ఙ' ధ్వనికి, 'కాఫీ'లో ఉన్న'ఫ'కి ప్రత్యేక సంకేతాలు లేవు. కాని తెలుగు వర్ణమాలలో వీలయినన్ని ధ్వనులకు సంకేతాలు సిద్ధంగా ఉన్నాయనడంలో విప్రతిపత్తి లేదు.

మరైతే తెలుగు లిపిని భారతీయ భాషలన్నిటికీ ఏకలిపిగా అమలుపరచ వచ్చు కదా! ఇందులో ఎంత సబబున్నా ఇతర భాషలవాళ్ళు, ముఖ్యంగా ఇండో ఆర్యన్ భాషా కుటుంబంవాళ్ళు అంగీకరిస్తారన్న నమ్మకం నాకయితే లేదు. "అందరూ దేవనాగరిలోనే రాస్తే పోలా?"– అంటారు. కాని మనవాళ్ళకి దానివల్ల లాభమూ కనిపించదు, సౌకర్యమూ కనిపించదు. పైపెచ్చు నాగరిలిపికన్న నిర్దుష్టమైందీ సమగ్రమైందీ తెలుగు లిపేనని దాఖలాలు చూపిస్తారు. తార్కికంగా కొంతవరకు అది సత్యమే అయినా చిత్తశుద్ధితో అందరూ అంగీకరిస్తారన్న నమ్మకమూ తక్కువే. అంచేత ఏ భారతీయ లిపిని తీసుకున్నా ఇదే సమస్య ఎదురవుతుంది. 'Old habits die hard' అన్నట్టు, పాత అలవాట్లు ఓ పట్టాన పోవు. మానసికమైన అనుబంధం తెంచుకోడం అంత సులువు కాదు.

అంచేత, 'ఏకలిపి లేకపోతే ఏం కొంప మునుగుతుంది?' అని ప్రశ్నిస్తారు కొందరు. ఏ కొంపా మునగదు. "ఇన్ని రాష్ట్రప్రభుత్వాలూ ఇన్ని భాషలూ ఉండగా లేంది, ఇన్ని లిపులు ఉంటేమట్టుకు ఏమవుతుంది?" అంటారు. "ప్రపంచమంతటా ఒకే ప్రభుత్వం ఉందా? ప్రపంచమంతటా ద్రవ్యవినిమయానికి ఒకే ప్రమాణం అమలులో ఉందా?" అని కూడా ప్రశ్నిస్తారు. కాదనలేం మరి!

లిపి ఏకమయినంత మాత్రాన భాషలు ఒకటి అవుతాయని ఎవరూ అనరు. దగ్గరి పోలికలున్న కన్నడ–తెలుగు భాషలకే సంపూర్ణ ఏకలిపి రూపొందడం సాధ్యం కాలేదే! భారతీయ భాషలన్నిటికీ సులువుగా సాధ్యమవుతుందని ఎలా చెప్పగలం? జాతీయ ముద్రకోసం అన్ని భాషలవాళ్ళూ (ఉర్దూ, కాశ్మీరీ భాషలవాళ్ళు కూడా కలిసివస్తారనుకుంటే మాట!) తమ తమ లిపులు వదిలిపెట్టేసి నాగరిలిపి ఒక్కటే వాడాలని శాసనం చేసి నిజంగా అమలుపరచగలరనుకున్నా దానివల్ల ప్రయోజనం లేదు. తెలుగులిపిలో లేని సౌలభ్యం నాగరిలిపిలోనూ లేదు. పైగా హ్రస్వ 'ఎ'కార 'ఒ'కారాలకు అక్షరసంకేతాలే లేవు. నయాన్నో, భయాన్నో ఏకలిపి ప్రవేశపెట్టినా, అది

వర్ణలిపి (alphabetic script) అయితే ఉపయోగం కాని, అక్షర లిపి (syllabic script) అయితే లాభంలేదు. ఒక వర్ణలిపి, మనలో కొందరికి ఇంగ్లీషు భాషద్వారా అలవాటయింది. అది రోమన్ లిపి. రోమన్ లిపి వాడ్డం మన జాతీయ సంస్కృతికి అవమానకరమనుకుంటే, ఏ భాషకున్న లిపిని దాన్ని వాడుకోనిస్తూ, వర్ణవిధేయంగా రూపొందడానికి కావలసిన సంస్కరణలు చేసుకోడానికి ప్రోత్సహించాలి. గత్యంతరం లేదు.

(1980 ఏప్రిల్ 24న రేడియోలో ప్రసారమయింది)

★ ★ ★

# అనుబంధం

## ఆధునిక ప్రమాణభాషాభగీరథులు

## గిడుగు వేంకటరామమూర్తిగారికి

# విజయపట్టప్రదానం

27 డిసెంబర్ 1933

# ఆధునిక ప్రమాణభాషాభగీరథులు
# గిడుగు వేంకటరామమూర్తిగారికి
# 'విజయపట్టప్రదానం'

[శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రిగారి సంపాదకత్వంలో రాజమహేంద్రవరంనుంచి వెలువడే 'ప్రబుద్ధాంధ్ర' మాసపత్రిక 1934 ఫిబ్రవరి సంచికలో 'రావుసాహేబు, మహోపాధ్యాయ గిడుగు వేంకట రామమూర్తి పంతులుగారికి విజయపట్టప్రదానం' అనే పేరుతో ఒక వ్యాసం వచ్చింది. గిడుగువారికి 70 ఏళ్ళు నిండిన సందర్భంగా, శిష్టవ్యావహారిక భాషాప్రతిష్ఠాపనకోసం వారు చేసిన కృషికి కృతజ్ఞతాసూచకంగా రాజమహేంద్రవరంలో జరిగిన సమ్మానోత్సవ వివరాలను ఈ వ్యాసంలో రచయిత కళ్ళకు కట్టించారు. సుమారు ఆరు దశాబ్దుల తరవాత దాన్ని పాఠకులకు అందించే అవకాశం కలిగినందుకు ఆనందిస్తూ వ్యాసరచయితకు కృతజ్ఞతలు తెలుపుకొంటున్నాను – పోదమూ.]

★ ★ ★

బాగా జ్ఞాపకం వుంది.

కవిశేఖర (ఇప్పుడు) వడ్డాది సుబ్బారాయుడుగారు వొకప్పుడు కొన్ని పద్యాలు చదివారు. అది 1913వ సంవత్సరం, ఏప్రిలు నెల. రాజమహేంద్రవరంలో ఆంధ్రసాహిత్య పరిషద్వార్షిక సమావేశం జరిగింది. అప్పట్లో ఆంధ్రసాహిత్య పరిషత్తు ఆంధ్రభాషా వాఙ్మయాల వికాసం సాధించడానికి పుట్టిందనీ, సాధిస్తుందనీ, "పరికరాలన్నీ అమరేయి కనుక అవు"ననీ అందరూ భావిస్తూ వుండేవారు. ఆ సమావేశానికి అనేక పండితులూ, కవులూ, భాషాభిమానులూ, వాఙ్మయప్రియులూ దూరదేశాలనుంచి కూడా ఆప్యాయనంగా వచ్చారు. గిడుగు రామమూర్తిపంతులుగారు కూడా తమ శిష్యబృందంతో వచ్చారు; కాని వారికి తమ వ్యావహారిక భాషావాదం వినిపించడానికి యెవరూ అవకాశం యివ్వలేదు. పైగా కొందరు పండితులు రామమూర్తిపంతులుగారూ,

జయంతి రామయ్యపంతులుగారూ వాదిప్రతివాదులని నిరూపిస్తూ రామ మూర్తిపంతులుగారు వోడిపోయారనీ, తిరస్కృతులైపోయారనీ – ఇంకా– ఇంకా – అన్నారు. అప్పుడు వసురాయడుగారు చదివిన పద్యాల్లో వొకదానిలో యిప్పుడవసరమైన భాగం యిది.

"గిడుగు రామమూర్తి నుడుగు నిల్వకపోయె
నొగి జయంతి రామయోక్తి గెలిచె"

వసురాయడుగారి కెప్పుడూ సభాసదుల భాషాజ్ఞానంమీదా, రసికతమీదా విశ్వాసం వుండదు. అంచేత వారు తమ పద్యాలు ఏ సభలో చదివినా విధిగా అర్థంకూడా చెబుతూ వుంటారు. అప్పుడు కూడా అలాగే సెలవిచ్చారు.

"కామ వుండేది గొడుగు, కామ లేనిది గిడుగు. గిడుగు గాలికి యెగిరిపోతుంది. రామమూర్తి పంతులుగారి వాదం గిడుగులాగ ఎగిరిపోయింది. జయంతి అనగా జయశీలము. రామయ్యపంతులుగారి వాదం జయశీలం కనక అది గెలిచింది."

అప్పుడు ఈ స్వారస్యం చాలా కరతాళాలు పొందింది.

ఇది యిరవై యేళ్ళ నాటిమాట. హేళనచేస్తూ, పెదవులు విరుస్తూ, లేవిడీలు కొడుతూ గ్రాంథిక (ఇప్పుడదే గ్రాంథికంకాదు!) వాదులు బుజాలెగరవేసుకుంటూ వుండేవారు; కాని రెండు దశలు గడిచాయి. గిడుగే నిలిచింది లక్షణంగాను.

★ ★ ★

1933 సంవత్సరం డిసెంబరు 27డో తేదీ రాజమహేంద్రవర నగర చరిత్ర లోనూ, ఆంధ్రభాషాచరిత్రలోనూ, ఆంధ్రవాఙ్మయ చరిత్రలోనూ, ఆంధ్రదేశ చరిత్రలోనూ, ఆంధ్రజాతి చరిత్రలోనూ ధ్రువతారలాగ మిలమిల మెరుస్తూ వుంటుంది. ఆవేళ నవయుగ పురుషులైన శ్రీరామమూర్తిపంతులుగారికి ఆంధ్రదేశీయులు విజయపట్టం కట్టారు.

చిత్రాంగిమేడ ఆవరణ అంతా సభ్యులతో కిటకిటలాడిపోయింది. నవీన వాఙ్మయ నిర్మాతలైన కవికుమారులంతా సింగపుకొదమల్లాగ బారులు తీరి కూర్చున్నారు. చిలుకూరి వీరభద్రరావుగారు, చిలకమర్తి లక్ష్మీనరసింహంగారు, పెండ్యాల వెంకటసుబ్రహ్మణ్యశాస్త్రిగారు, నిడమర్తి దుర్గయ్యగారు మొదలైన వృద్ధులుకూడా చాలామంది దయచేశారు. తమ పూర్వపు చమత్కారాన్ని దిద్దుకోడానికా అన్నట్టు వడ్లాది సుబ్బారాయడుగారు గూడా విజయంచేశారు. యువకులై వుండిన్నీ యింకా పూర్వాంధ్రాన్ని పట్టుకునే పాకులాడుతూ వున్న

కవిరాజు వత్సవాయి నీలాద్రిరాజుగారున్నూ దయచేశారు. కొంతసేపటికి సర్. వేంకటరత్నం నాయుడుగారు వచ్చారు.

జయంతి గంగన్నగారు సభకి ఆధిపత్యం వహించి కార్యక్రమం నడిపారు. కుమారులూ, మనమలూ పరివేష్టించియుండగా రావుసాహేబు, మహోపాధ్యాయ గిడుగు వేంకటరామమూర్తిపంతులుగారు ధర్మపత్నితో నిండుకొలువు తీర్చారు.

కళ్ళున్నవారు ఆ సౌభాగ్యం, ఆ వైభవం, తేజస్వంతమైన ఆ సన్నివేశం చూసి సంతోషించారు. హృదయం వున్నవారు ఆ అపరవాగనుశాసనుని మహత్వం బోధపరుచుకొని పరవశులైనారు.

అధ్యక్షులు రామమూర్తిపంతులుగారిని గురించి చాలా సంగతులు చెప్పి "వ్యావహారికభాషకు ప్రాముఖ్యం యివ్వాలని పంతులుగారు 1907 వ సంవత్సరంనుంచీ కృషిచేస్తున్నారు. వీరి కృషివల్లా, పట్టుదలవల్లా వ్యావహారిక భాషలోనే నేడు అనేక కవులు గ్రంథరచన చేస్తున్నారు. వీరికి కన్నడమూ, ఫ్రెంచీ, ఇంగ్లీషూ, అరవమూ, తెనుగూ, సంస్కృతమూ, లాటినూ – ఈ భాషల్లో అపారమైన పాండిత్యమున్నది. వీరు మాట్లాడుతూ వుంటే వొక్క పొల్లుమాట అయినా రాదు. వీరితో మాట్లాడడం విద్యాభ్యాసం చెయ్యడమే. వీరిని నడుస్తూ వున్న – మాట్లాడుతూ వున్న విశ్వవిద్యాలయం అంటే అతిశయోక్తి యేమీ వుండదు. గంజాం జిల్లావాసులైన పంతులు గారికి ఆంధ్రవాఙ్మయానికి మూలపీఠమైన రాజమహేంద్రవరంలో యిలాంటి సన్మానం చెయ్యడం చాలా గొప్ప విషయం. పంతులుగారిని తెలుగులో ఫయిలాలాజికల్ గ్రామరు రాయవలసిందని మనం కోరవలసివుంది" అంటూ సభాప్రారంభం చేశారు. తరవాత ఆంధ్రదేశేతిహాస పరిశోధక మండలివారూ, గౌతమీ గ్రంథాలయంవారూ, రాయలసీమ కృష్ణదేవరాయల విద్యాపరిషత్తువారూ, ఆంధ్రభారతీతీర్థవారూ, కల్చర్డు వుమెన్సు సొసైటీవారూ, కళాసమితివారూ, సాహితీసమితివారూ, సాహిత్యమండలివారూ రామరాయ చిత్రకళా సంఘంవారూ పంతులుగారికి సన్మానపత్రాలూ పూలదండలూ సమర్పించారు.

తరవాత కావ్యవ్యాకరణతీర్థులు పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రులుగారు యిలా సెలవిస్తూ శ్రీపంతులుగారికి వెండిపెట్టెలో వుంచి కమెమొరేషన్ వాల్యుములు సమర్పించి, దుశ్శాలువులు కప్పినారు. కరతాళధ్వనులతో దిక్కులు పిక్కటిల్లినవి.

"ముక్కోటి ఏకాదశి మహాపుణ్యదినం. పవిత్రమైన వృద్ధజాహ్నవీతీరం. పండితులుగా, కవులుగా, చిత్రకారులుగా, భాషాసేవకులుగా, సంఘసేవకులుగా ఎన్నో తరాలనుండీ నేటిదాకా ఎన్నెన్ని మార్లో ఆ విశ్వమూర్తి అవతరించిన స్థలం. వెనకటి జన్మాలల్లో చేసిన పుణ్యం కొద్దీ ఈ జన్మలో ఇన్నినాళ్ళకు ఆంధ్రపండితుణ్ణి అనే పేరు పెట్టుకొన్నందుకు కలలో గూడా ఇట్టి భాగ్యం లభిస్తుందని అనుకోని నాకు శ్రీరామమూర్తిపంతులుగారికి కమెమొరేషన్ వాల్యూం సమర్పించే మహాభాగ్యం కల్గింది."

"రాజకులైకభూషణుడు రాజనరేంద్రుడి కాలంలో గానీ, తెలుగువల్లభుండ, తెలుగొకండ అని చెప్పుకోగల్గిన రాయల కాలంలో గానీ ప్రభుపీఠాలు, పండితపూజలు మహావైభవంతో జరిపివున్నా యనుకొన్నా జనసామాన్యానికి అందుబాటులో వుండేటట్టు విజ్ఞానాన్ని వ్యాపింపజేస్తానని కంకణం కట్టుకొని దాన్ని సార్థకం చెయ్యగలిగిన మహాసత్త్వునీ ప్రజ్ఞానిధినీ పండితునీ కృతజ్ఞత్తో, సత్కరించేందుకై ముక్కోటి మతభేదాలు గల మన ముక్కోటి ఆంధ్రులూ ఏకగ్రీవంగా సిద్ధపడడమనేది నాడు వుందా అని ఆశంకిస్తున్నాను."

"ఆంధ్రదేశంలో ప్రజ్ఞాప్రభావనిధులగు పండితులకు గానీ, ప్రభువులకు గానీ నేటికీ కొరత లేదు; అనంతసత్వసంపన్నులయిన అన్నలూ, తమ్ములూ అనేకులున్నారు. వారు పూనుకొంటే ఇట్టి మహోత్సవాలు అనేకం నిర్వహిస్తారు నిస్సందేహంగా. అయినా అవి వారి ప్రజ్ఞావిభవాలను వెల్లడిస్తాయే కాని ఆంధ్రజనసామాన్యపు హృదయానందాన్నీ, కృతజ్ఞతాపారమ్యాన్నీ వెల్లడింపలేవేమో అని నా ఊహ."

"రామమూర్తిపంతులుగారి అమూల్యమైన జీవితకాలంలో ఇది డెబ్బయి వకటో యేడు. అయినా సింహగర్జనంతో సారస్వతక్షేత్రానికి వురికే వారి మూర్తిని చూస్తే "వృద్ధాశ్శిష్యా గురుర్యువా" అనిపిస్తుంది. పంతులుగారు వ్యావహారికాంధ్రానికి యుగపురుషులు. అంటే వారి సృష్టి అనుకోరాదు. ఇది తెలుగుతల్లి అనాదైన లీలావిభవం. పంతులుగారున్నూ ఆ తల్లియొక్క రూపాల్లో చేరినవారే, అయినా ఆయన ఆ తల్లికి వక అర్చ్యావిభవం కల్గింపకలిగినారు. కాబట్టే ఆయన్ను యుగపురుషుడన్నాను".

"వ్యావహారికాంధ్రం ఆయనచేతుల్లో వప్పగింపబడింది మొదలుకొని నేటిదాకా ఈరెండు పుష్కరాల్లోనూ దాన్ని రూపుమాపుటకై మనలో కొందరు చూపిన ప్రతీపభక్తికి ఏమీ లోపంలేదు. కావలసినంత. ప్రాతికూల్యప్రవాహం ఉరవడించే కొద్దీ అతిజాగ్రత్తతో నావ నడిపి ఒడ్డుకు చేర్చిన కర్ణధారుడు రామమూర్తిపంతులు. కాబట్టే జనసామాన్యకోటిలోని మనం అందరం

ఆయనకు కృతజ్ఞత వెల్లడించుకొనేందుకు ఈ ఉత్సవం ఏర్పాటు చేశారు. ఉద్యానప్రతిష్ఠ సప్తసంతానాల్లో వకటి. పంతులుగారి నిరంతరకృషివల్ల ఏర్పడ్డ వ్యావహారికాంధ్రోద్యానం శాశ్వతమైంది. కాపు పట్టింది. బీదా సాదా భేదం లేకుండా పండితుల దగ్గర్నుంచి పామరులవరకూ ఆకర్షించి హాయినీ, స్థాయినీ, ఆనందాన్నీ యిస్తున్నది. అజరామరం అయింది కాబట్టే వారి యీ డెబ్బయ్యో జన్మదినోత్సవంలో వారి తోటలో పూచినట్టీ, పండినట్టీ పుష్పాలనూ, ఫలాలనూ వారికే యీ కమెమొరేషన్ వాల్యూములు రూపంగా కృతజ్ఞతతో సమర్పిస్తున్నాను. ఈ కాన్కలో పంతులుగారి భాషావ్యవసాయాన్నీ పాండిత్య ప్రకర్షనూ మెచ్చుకుంటూ స్వదేశస్థులూ విదేశస్థులూ అయిన విబుధులు వ్రాసిన ఆంగ్లాంధ్రవ్యాసావళి వకటి. రెండోది భాషాతత్వ ప్రదర్శనపూర్వకంగా ఆంధ్రభాషాపరిణామాన్ని నిరూపించే స్వకీయవ్యాసావళి. మూడోది వారి వాదాన్ని నిరూపించే శబ్దాలను నిర్దుష్టములని ఋజువుపరిచే లక్షణగ్రంథం. పేరు 'బాలకవిశరణ్యం'. నాలుగోది 'ఆంధ్రపండితభిషక్కుల భాషాభేషజం'. అయిదోది ప్రాచీనకాలపు వచనరచన తెలిపే 'గద్యచింతామణి' అనేది.

"ఆంధ్రాంగ్లవ్యాసావళిలో ముఖ్యాలు – స్టెన్‌కోనోగారు వ్రాసిన ముండా భాషలు అనే వ్యాసం, సీతాపతిపంతుల పరేన్‌భాషను గురించిన వ్యాసం, ఎల్. వి. రామస్వామి అయ్యంగారి ద్రావిడిక్ గైడ్సు మున్నగునవి. ఇవి అచ్చం ఆంధ్రపండితులుగా వున్నవారికి ఎంతో విజ్ఞానాన్ని కలిగిస్తవి. డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారి చారిత్రికవ్యాసం అమోఘ పరిశోధనను వెల్లడిస్తున్నది. పాశ్చాత్య పండితులు నేటి అభినవాంధ్రపండితుల పరిశ్రమనూ, ఉత్సాహమునూ ప్రశంసించిన వ్యాసాలున్నవి. ఆంధ్రవ్యాసాలలో పండితులూ పామరులూ కూడా గమనింపదగ్గవి అనేకం వున్నవి. అందులో శ్రీ కోరాడ రామకృష్ణయ్యగారి "ఆంధ్ర భాషాపదములు – వాటి నిష్పత్తిక్రమము" అనే వ్యాసమూ, డాక్టరు చిలుకూరి నారాయణరావు పంతులుగారి "మాత్రా ఛందస్సులు" అనే అమోఘమైన వ్యాసమూ, శ్రీ శివశంకరశాస్త్రిగారి "పదకర్తలు" అనే వ్యాసమూ, వేదుల సత్యనారాయణశాస్త్రులుగారి హాస్యం వ్యాసమూ, "మాతృభాష – పరభాష" అనే వెంకటరత్నంగారి వ్యాసమూ వివిధ విషయపరిశోధనలను వెల్లడిస్తూన్నవి. చింతా దీక్షితులుగారి 'లీలాసుందరి' అనే బాలానందం నిజంగా బాలానందమే. భమిడిపాటివారి "అన్నీ తగాదాలే" అనే వ్యాసం, తెలికిచర్ల కృష్ణమూర్తిగారి "అణువులు – వాటి పరిమాణము" అనే వ్యాసం, విస్సా అప్పారావుపంతులుగారి "చెవి చేయు పని" అనేదీ చాలా ఉత్తమ వ్యాసాలు. రాళ్ళభండివారూ, చిలుకూరివారూ జాయింటుగా వ్రాసిన "తూర్పుగాంగరాజులను గురించిన ఆరు క్రొత్త శాసనములు" అనేదీ,

సోమశేఖరశర్మగారు వ్రాసిన "పొట్లదుర్తి మాలెపాడు శాసన వ్యాసం" అనేది అద్భుతములగు అనేక చారిత్రికాంశములనూ, తత్కర్తల విజ్ఞానమునూ చాటుతున్నవి. రెండోదీ, మూడోదీ, నాల్గోదీ శ్రీరామమూర్తిపంతులుగారి గ్రంథాలే."

"మొత్తం యీ అయిదు గ్రంథాలనూ ఆంధ్రదేశీయులందరూ కలిసి అచ్చువేయించినారు. వాటిని ఈ సభలో శ్రీరామమూర్తిపంతులుగారికి అర్పించే పనిని సభవారు నాకు ఏర్పరచినందున విశ్వేశ్వరునికి విశ్వగతమైన వస్తువులనే అర్పించిన రీతిగా సభవారి అనుమతితో వారు ప్రోది చేసిన వ్యావహారికాంధ్రం అనే ఉద్యానవనంలోని ఈ దివ్యములయిన గ్రంథరూపమైన పుష్పాలనూ, పండ్లనూ వారికే సమర్పిస్తున్నాను. శ్రీరామమూర్తి పంతులుగారు వీనిని స్వీకరించి ఆశీర్వదింతురుగాక."

తరవాత డాక్టరు చిలుకూరి నారాయణరావుపంతులుగారు తాము క్రొత్తగా రచియించి ఈ సందర్భంలో ప్రకటించడానికే అచ్చువేయించిన 'అంబ లేక మొండిశిఖండి' అను నాటకాన్ని వొక అంకం చదివి సభ్యులకు వినిపించి శ్రీరామమూర్తి పంతులుగారికి అంకితం చేశారు.

పిమ్మట రామమూర్తిపంతులుగారు వయస్సునుబట్టి వృద్ధులయినా సింగపుకొదమలాగ లేచి మేఘగంభీర గర్జనలతో యిలా సెలవిచ్చారు.

"ఏ విషయమైనా మంచిదో చెడ్డదో నిర్ణయించుకొనే భారము మనిషిమీద ఉంటుంది. ఒకరికి మంచిదని తోచింది మరొకరికి మంచిది కాకపోవచ్చు. కాని మనస్సాక్షిగా తనకు మంచిదని తోచింది తానాచరించడము తన విధి. నేను నాకు మంచిదని తోచిన విషయమును గురించి పరిశ్రమ చేసి అందలి సత్యము గ్రహించి వెల్లడిస్తాను. బాల్యమునుంచీ ఇట్టి నియమమునే నేను పెట్టుకున్నాను. ఆ నియమము ప్రకారమే నడుచుకొంటున్నాను. ఇక నా వాదన సంగతి.

లోకమంతా వకటి. తక్కిన భాగాలతో సంబంధం లేనిదే అది ఉండదు. ఒక వేలు ఇంకో వేలుతో కూడితేనే గాని ఏ పనీ చెయ్యలేదు. విశ్వము అంగి. తక్కినవి అంగములు. శరీరము అంగి. అవయవములు అంగములు.

★ ★ ★

వివాహము ఒక Institution. దానిలో system ఉంటుంది. దేవతార్చనకూడా అట్టిదే. వివాహములో మాటలూ దేవతార్చనలో మాటలూ వాటితో సంబంధం ఉన్నవారికి తెలుస్తవి.

యజ్ఞముకూడా ఒక (System). కాని దానినెవరూ చెయ్యడంలేదు. ఆ మాటలకిప్పుడు అర్థము తెలియదు. యజ్ అనే ధాతువునుండి 500 మాటలు పుట్టినవి. ఇప్పుడు వాటి అర్థమేమి తెలుస్తుంది? సత్యనారాయణ వ్రతమునకు సంబంధించిన మాటలిప్పుడు తెలుస్తవి. System కీ తదంగములకూ పరస్పర సంబంధం ఉంటుంది.

భాషకూడా అట్టిదే. "భగవంతుడు మనుష్యునకు వాక్కు ప్రసాదించాడు" అని షెల్లీకవి అన్నాడు.

ఆరేండ్ల బాలుడికి అతని లోకజ్ఞానముతో సమానమైన భాష అతని కుంటుంది. అదే మాతృభాష; జీవద్భాష.

★ ★ ★

పూర్వము కాలమును తెలియజేయడానికి గడియలు వాడుక చేసేవారు.

ఇప్పుడు గంటలు వాడుక చేస్తున్నారు. కాలము ఒక (System). దీనికీ అంగములకూ పరస్పర సంబంధం లేనిదే అర్థం కాదు.

నన్నయ్య ఈ గోదావరిలోనే స్నానంచేసి సంధ్యావార్చేవాడు. నన్నయ "నేడు, ఎల్లి" అనే సందర్భములో మనము "ఈవాళ, రేపు" అంటున్నాము. నన్నయకాలములో "రేపు" అనగా "మాపు" కాని దన్నమాట.

ఈ system లో వ్యత్యాసం కలిగింది.

నన్నయ్య కాలాన "సాని" అనగా "తల్లి" అని అర్థము. ఈ కాలములో "తల్లి" ని "సాని" అనరు. ఇప్పుడు "సానెలు" ఏ అర్థములో వాడుతున్నామో అప్పుడు "లంజియలు" ఆ అర్థములో వాడేవారు.

నన్నయ కాలమునాటి ఉద్యోగాలు నేడు లేవు. ఇప్పుడున్నవి అప్పుడు లేవు. ఇన్‌స్పెక్టరు, కలక్టరు, ఓవర్సీయర్, హెడ్మాస్టర్ మొదలైన పదములు ఈకాలపువి. ఇప్పుడు అర్థమౌతవి. నన్నయ కాలమునాటి పదములు ఇప్పు డర్థముకావు. ఎక్కువ పరిశ్రమచేస్తే కొన్ని అర్థమౌతవేమో.

★ ★ ★

భారతంలో శబ్దములన్నీ దేశభాషతో సంబంధం కలవి గనక సార్థకములు.

డ్రాయింగు వేసినప్పుడు background వెయ్యాలి. అది లేనిదే చిత్రాని కర్థం లేదు.

ఒక చిత్రములో గోపురము ఎత్తు తెలియజేయవలసి వచ్చినప్పుడు ఒక చెట్టుతో సంబంధం ఏర్పరచాలి. ఒక బెలూన్ (balloon) ఎంత ఎత్తు

వెళ్ళిందో తెలపడానికి ఒకవిధమైన మేఘములతో సంబంధం ఏర్పాటు చేసి చిత్రించిన చిత్రమొకటి ఒక ఫ్రెంచిపత్రికలో నేను చూచాను.

★ ★ ★

నన్నయ కాలమునాటి దేశభాషలో ఒక నూరోవంతైనా మిగలలేదు. అంతా కొట్టుకుపోయింది. నన్నయకాలంలో అప్పటివారి కర్థమయ్యే పదాలు మనకిప్పుడు కావు. వేదకాలమునాటి పదముల కర్థముగాక వేదపండితులు వాటిని గురించి యద్వా యద్వా అంటూ ఉంటారు.

భారతభాషలో మాటలకు శబ్దరత్నాకరంలో అర్థము వ్రాయవలసి వచ్చినప్పుడు 'చింత్యము, అస్పష్టము' ఇత్యాదిగా వ్రాసినాడు తద్గ్రంథకర్త.

నన్నయకాలంలో ఏ పదము ఎట్లా ఉండేదో తెలుసుకోవడం కష్టము.

నన్నయగారి తాటాకుల ప్రతి ఇప్పుడు దొరకదు. దానినుండి వ్రాసిన ప్రతులలో ఆ ప్రతుల ప్రతులలో మన కాలమున దొరుకుతవి. అవి ఎవరో లేఖకులు వ్రాసుకొన్నవి. వారు మాతృకనుండి సరిగా వ్రాశారా అంటే – అది దైవాయత్తం. "నడుచు, నడచు" – ఇందేది సరియైన రూపమో నిర్ణయించడమెట్లా? యతిస్థానంలో చూపగలిగితే తెలుస్తుంది. లేకుంటే తెలియదు.

"సొలయు, సొలచు" – ఇందేది సరియైనదో తెలుసుకోడానికి ప్రాసస్థానంలో చూడాలి. లేకుంటే తెలియదు. అది దైవాయత్తం. శకటరేఫల విషయమూ అంతే.

నన్నయ కాలమునాటి భాష శిలాక్షరములలో నందంపూడి శాసన రూపమున ఉన్నది. దానినిబట్టి నాటి దేశభాష స్వరూపం కొంత తెలుస్తుంది. జయంతి రామయ్యపంతులుగారు దానికర్థము చెప్పలేకపోయారు, ఆనాటి భాషాస్వరూపం తెలియకపోవడంవల్ల. చరిత్ర తెలుసుకోవడంకోసమే భాష. నన్నయకాలంనాటి భాష మళ్ళీ ప్రయోగించడానికి కాదు. నన్నయ భారతమును అచ్చువేసినపుడు పరిష్కర్తలు రూపాలు మార్చారు. రెండున్నర పర్వాలలో భాషా ఇదమిత్థమని చెప్పడానికి వీలులేదు.

★ ★ ★

కవిత్వము ఒక కళ. కళకు దేశభాషలో ఉన్న అన్ని శబ్దాలూ అవసరము లేదు.

భాష వనమువంటిది. భాషలో ఎవరికి కావలసిన మాటలు వారు తీసుకొంటారు. నన్నయ కాలమునాటి దేశభాషంతా నన్నయభారతములో ఉన్నదని చెప్పడానికి వీలు లేదు. తెలుక్కు మారుగా సంస్కృతం వేసిన చోట్ల తెలుగే వేస్తే నన్నయ భాష ఇంకా తెలిసిఉండేది. ఒకమాట. "అట్టేడు" అనే పదము ప్రథమావిభక్తి. దానికి ద్వితీయావిభక్తి ఏమిటి? నన్నయ వాడలేదు. కాబట్టి మనకు తెలియదు. "కురియు" – దీనికి ప్రేరణార్థకము "కురిసిరి." నేడు "కురియించు" అనే పదమునకు మారుగా గ్రాంథికులు "కురిపించు" అని వ్రాస్తున్నారు. ప్రాచీనభాష తెలియక వ్యావహారిక పదములను వాడి దానిని గ్రాంథికమని లోకులను భ్రమింపజేస్తున్నారు. తిక్కనాదుల విషయములో కూడా ఇట్లే చూచుకోండి.

గ్రాంథికభాష అతుకుల బొంత. స్పెన్సరు ఆంగ్లకవి ఫెయిరీ క్వీన్ అనే కావ్యము యిట్టి భాషలో వ్రాస్తే పండితులు అది ఏ భాషా కాదన్నారు. అట్లాగే గ్రాంథిక భాష ఏ భాషా కాదు. ప్రాచీన భాషా కాదు, దేశభాషా కాదు. అందరు కవుల భాషలా కలయిక. తెలుగులక్షణం పట్టి దెబ్బలాట వ్యవహారం. సంస్కృతం ఇట్లా ఉండదు. పతంజలి ఎంత చెప్పితే అంత.

★ ★ ★

గ్రాంథికభాషకు లక్షణం లేదు. "చేతురు కోతురు" ఇత్యాదులు చిన్నయ్యసూరి తప్పన్నాడు. గ్రాంథికులంతా ఈపదాలు వాడుతున్నారు. "ఉన్నాను" అనే మాట చిన్నయసూరి వప్పుకొన్నాడు. నన్నయ, తిక్కన, శ్రీనాథుడు, జక్కన వరకూ ఎవరూ ఈ రూపము వాడనే లేదు. జయంతి రామయ్యగారు "ఉన్నాను, ఉన్నారు" అనే ప్రయోగములు చేశారు. చిలకమర్తి లక్ష్మీనరసింహంగారి గ్రంథాలలో ఈ ప్రయోగాలు కావలసినన్ని ఉన్నవి. వ్యవహారభాషనే వ్రాసి ఉన్నట్లయితే వారి 'రామచంద్రవిజయం' ప్రమాణగ్రంథ మయ్యేది.

గురజాడ అప్పారావూ, పి. టి. శ్రీనివాస అయ్యంగారూ నేనూ ఈ వాదన లేవదీస్తే అప్పుడు మమ్మల్నందరూ దూషించేవారు.

The three tailors of the Tanning street అన్నారు, మమ్మల్నప్పుడు.

★ ★ ★

వీరేశలింగంగారు బ్రతికున్నకాలంలో వారు నాతో భాష విషయమై స్వేచ్ఛగా వాదించారు. నా వాదనలో సత్యం ఆయన అంగీకరించారు.

నన్నయ మొదలు వీరేశలింగంగారివరకూ భాష మారలేదని చిలకమర్తి లక్ష్మీనరసింహం గారన్నారు. వీరు వ్రాసిన భాష నన్నయ భాష కావలసివస్తే రెండువేల తప్పులు సవరించవలసి ఉంటుంది.

వడ్డాది సుబ్బారాయుడుగారు మహాజాగ్రత్తగా వ్రాసేకవి. వారు "అగుపడు" అనే పదం వాడారు. "అగుపడు" అనే పదము తప్పనిన్నీ, "అగ్గపడు" "అగపడు" అనే రూపములు సరియైనవనిన్నీ, "అగపడు" అనే పదమునకు అర్థము "స్వాధీనమగు", "చిక్కు" అనిన్నీ నేను వారికి చెప్పాను. వేదం వేంకటరాయశాస్త్రిగారు "ఔపర్చు" "ఔపించు" అనే వింత కృతకరూపాలు వాడారు. నేను చెప్పినమీదట వసురాయకవిగారు దిద్దుకొన్నారు. ఇందును గురించి వ్యాకరణములో సూత్రము లేదు. కాబట్టి కవులు తమకు తోచిన రూపములు వాడారు. వావిలాల శివావధానులుగారు "అందరికి" అనే పదము మొదట వాడి తరవాత ఎవరో పండితులు తప్పన్నారు కాబోలు దానిని "అందరకు" అనే కృతకరూపముగా దిద్దారు.

గ్రాంథికభాష యిలా ఉన్నది.

అరవై సంవత్సరముల వయస్సు వచ్చినవారికి కూడా ఈ భాష రాకుండా ఉంది. అకారమధ్యమో, ఇకారమధ్యమో, ఉకారమధ్యమో తెలియదు కొన్ని పదముల విషయమున, ఈ పండితులకు. ఇంకెందుకు ఈ భాష!

గ్రాంథికభాషను పండితులుంచుకోనీండి. మీరు దేశభాష వాడండి.

★ ★ ★

నా చిన్నతనంలో తీర్పులు తెలుగున వ్రాసేవారు. పండితుల అభిప్రాయాలు తీసుకొనేవారు. వాటికి 'ఫట్వాలు' అని పేరు. ఈ ఫట్వాలూ తీర్పులూ వ్యావహారిక భాషలోనే ఉన్నవి. వచనగ్రంథములలో వ్యవహారభాషనే సంప్రదాయసిద్ధముగా వాడేవారని నా గద్యచింతామణి అనే గ్రంథములో అనేక గ్రంథములనుండి ఉదాహరణలతో నిర్ధారణ చేశాను.

నన్నయ తిక్కనలు తమ గ్రంథాలలో శుద్ధదేశభాషనే వాడారు.

నాకు ఎన్నో సన్మానపత్రాలు సమర్పించి నాకు లేని యోగ్యత మీరు ఆరోపించారు. నాకింత గౌరవమిక్కడ జరుగుతుందని నేననుకోలేదు. మీకు నాయందు గల దయవల్ల నాయందు లేని గుణములు నాకు ఆరోపించారు.

★ ★ ★

ఈ వాదము నాకు నచ్చింది. దేశభాషపై ఉన్న నిరోధం తొలగించడం మన కర్తవ్యము. స్వభాషలో మాట్లాడ్డానికి ధైర్యం లేకపోవడం ఏల? Gag చేశారు కాబట్టి. ఈ నిరోధం తొలగిస్తే స్వేచ్ఛ కలుగుతుంది. గవర్నమెంటుకంటె ఎక్కువగా పండితులు Liberty of speech (వాక్స్వాతంత్ర్యము) తీసివేశారు. మనకు వాక్స్వాతంత్ర్యము లేదు. గ్రామ్యత్వం తొలగించమంటున్నాను నేను. పండితులూ కవులూ శిష్టులూ వాడే భాష తప్పనడం అవివేకం. ఎలమంచిలి సభలో మహామహోపాధ్యాయ తాతా సుబ్బరాయశాస్త్రిగారు శిష్టవ్యవహారమందున్న భాష గ్రామ్య మనరాదని తీర్మానించారు. 'అపభ్రంశ' మనే మాట ఉన్నది. 'గ్రామ్యం' అనే మాట లేనేలేదు. గ్రామ్య మనేది పారిభాషిక పదము. వ్యుత్పత్తి నిరూపిస్తుందిగాని ప్రయోగము తప్పని సూచించదు. దేశభాష అపరిమిత ప్రయోజనము కలది. వ్యవహారములో లేని భాషలు పరిమిత ప్రయోజనము కలవి. పాణిని, పతంజలి కాత్యాయని వ్యవహారభ్రష్ట పదములు వాడరాదని అనుశాసించారు.

గురజాడ అప్పారావూ నేనూ బాల్యమునుండే విద్యాభ్యాసము చేశాము. చిన్నతనంలో మేమంతా కలిసి నలనాటకం ఆడాము. అప్పారావు కన్యాశుల్కం వ్రాయడాని కిదో కారణం.

ఇంగ్లీషు ప్రైమరీ పరీక్ష ప్యాసయి మన దేశము ఏ పోలీసు సూపరెంటు ఉద్యోగము చెయ్యడానికో ఇంగ్లీషు వాడు వస్తాడు. అతడు మాట్లాడే ఇంగ్లీషు చక్కని ఇంగ్లీషు అంటారు. యమ్మే ప్యాసుచేసిన విద్యాధికుడు మాట్లాడే తెలుగు తెలుగు కాదంటారు మన పండితులు. పండితులు వ్యవహార భాషలోనే బోధిస్తారు. మేము వ్రాస్తే తప్పంటారు. సత్యం తెలిసేవరకూ తిడతారు.

ఈ ఊళ్ళో వెనక సభ చేసినప్పుడు నా మాట ఎవరూ వినలేదు. అప్పుడు కొవ్వూరిలో సభ జరిగింది. ఆ సభలో పోలవరం జమీందారుగారూ, దివాకర్ల తిరుపతిశాస్త్రిగారూ నా వాదమంగీకరించారు. వీరేశలింగంగారూ నా వాదమంగీకరించారు.

ఇరవై సంవత్సరాలకు క్రితము వ్యవహారభాష బోధించవచ్చునని తీర్మానిస్తే పనికిరాదని 20,000మంది వ్రాళ్లతో రెండువందల టిల్లిగ్రాములతో గవర్నమెంటువారికి మహజరు పంపించినారు. అప్పటికది ఆగిపోయింది.

ఇప్పుడు ఏమి చేయవలెనో మీకు తెలుసును. రెండుకోట్లమంది సొమ్ము దేశభాష. హక్కు కాపాడగలవారు మీరు.

శివశంకరశాస్త్రిగారు నా చెయ్యి చూచి ఇంకా పదకొండు సంవత్సరాలు బ్రతికి ఉంటావని సాముద్రికం చెప్పినారు. నేను జీవించి ఉంటే నేను పూనుకొన్న నిఘంటు కార్యము పూర్తిచేస్తాను. శబ్దరత్నాకరములో 2000 తప్పులున్నవి. నేనన్నమాటే కాదిది. మానవిల్లి రామకృష్ణకవిగారూ సూర్యరాయ నిఘంటుకారులూ కూడా ఈ మాటే అన్నారు. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు అనేక వందల మాటలు శబ్దరత్నాకరములోకి ఎక్కలేదని చెప్పినారు.

వ్యాకరణమూ నిఘంటువూ – ఇవి record వంటివి. ఇవి ప్రమాణము కావు. శిష్టవ్యవహారమే ప్రమాణము.

వైయాకరణులూ, నైఘంటికులూ శిష్టపదములు వేసుకోకుంటే వారిదే తప్పు.

వాక్కు ఆత్మను ప్రకాశింపచేసేది. లోకానికి సూర్యునివల్ల ప్రకాశము కలుగుతోంది. సూర్యుడు లేనప్పుడు చంద్రుని ప్రకాశముంటుంధి. చంద్రుడు లేనప్పుడు నక్షత్రములు ప్రకాశిస్తవి. నక్షత్రములూ లేనప్పుడు, అగ్ని, అగ్ని లేనప్పుడు వాక్కు.

ఆత్మను ప్రకాశింపచేస్తుంది వాక్కు.

*"శబ్దబ్రహ్మాత్మనే శివాయ నమః"*

★ ★ ★

పంతులుగారు ఉపన్యాసం చేసినంతసేపూ స్త్రీపురుషులందరూ – సభ అంతా నిస్తరంగసముద్రంలాగ గాంభీర్యం వహించింది.

మనవాళ్ళు పదిమంది యెక్కడ కూడినా గుసగుసల్లో పడిపోతారని వొక నింద వుంది; కాని నేను దాని కంగీకరించను. సభ్యుల ప్రవర్తన ఉపన్యాసకుని వాఙ్మాధుర్యాన్నిబట్టీ, ఉపన్యాసవిషయాన్ని పట్టీ మారుతూ వుంటుంది. రామమూర్తిపంతులుగారి వంటి వక్తలు మనలో అరుదుగా వున్నారు. వా రెక్కడ యెప్పుడు ఉపన్యాసం చేసినా సభ్యులు గాంభీర్యముద్రనే వహిస్తారు. ఆనాటి సభలో కుమారకవిసింహాలు కూడా చాలామంది వుండడంచేత సభ అంతా గాంభీర్యాన్నే గాక ఔదార్యాన్ని కూడా ప్రకటించింది.

గోదావరితల్లి యిదంతా చూసింది. ఇదంతా వింది. ఆదికవీ, ఆదివాగనుశాసనుడూ అయిన నన్నయ భట్టారకుని లీలావిలాసాలన్నీ చూసి ఉప్పొంగిన మహానుభావురా లామె. ఆ దివ్య పురుషుని, పరమ పవిత్ర దైనిక జీవితాన్ని మనకిప్పటికీ అస్పష్ట కలకల నినాదంతో వినిపిస్తూ వున్న వాత్సల్యవతి

ఆమె. రాజరాజనరేంద్రుని నిండుకొలువై కవితావినోదాలతో ఘూర్ణిల్లిపోయిన రాజమహేంద్రవరంలో యిప్పటికీ, ఎప్పటికీకూడా కవితావిలాసాలూ, వాఙ్మయప్రీతీ ప్రోదిచేసే అమృతపయస్విని ఆమె. ఆమె రామమూర్తిపంతులుగారి మహత్తు గ్రహించింది. వారు నన్నయ భట్టారకుని పదవిలో నిలిచివుండడం గుర్తించింది. సమగ్రమైన ఆంధ్రజాతి ఈ ఆధునిక వాగనుశాసనుడికి పాదపూజ చేస్తూ మళ్ళీ తన భవిష్యదున్నతికి పునాది వేసుకుంటూ వుండడం గ్రహించింది. ఆమెకి పులకలు పేటెత్తాయి. హృదయం ఉప్పొంగిపోయింది. ఆనందమూ పారవశ్యమూ తలమునకలైపోయాయి.

నా మాటమీద మీకు నమ్మకం లేకపోతే ఆమె జీవనంలో కొత్త పొంగూ, ఆమె నడకలో కొత్త భంగిమా, ఆమె కలకలనవ్వులో కొత్త మాధుర్యమూ కలిగాయో లేదో వెళ్ళి చూడండి.

- శ్రీపాద సుబ్రహ్మణ్యశాస్త్రి

★ ★ ★

| | |
|---|---|
| తెలుగు | పోరంకి దక్షిణామూర్తి |
| తమిళం | போரங்கி தக்ஷிணாமூர்த்தி |
| కన్నడం | ಪೋರಂಕಿ ದಕ್ಷಿಣಾಮೂರ್ತಿ |
| ఇంగ్లీషు | PORANKI DAKSHINA MURTY |
| మలయాళం | പോരങ്കി ദക്ഷിണാ മൂർത്തി |
| రష్యన్ | ПОРАНКИ ДАКШИНА МУРТИ |
| బెంగాలీ | পোরঙ্কি দক্ষিণামূর্ত্তি |
| హిందీ/మరాఠీ | पोरंकि दक्षिणामूर्ति |
| గుజరాతీ | પોરંકિ દક્ષિણા મૂર્તિ |
| అస్సామీ | পোৰঙ্কি দক্ষিণামূৰ্ত্তি |
| ఒరియా | ପୋରଙ୍କି ଦକ୍ଷିଣା ମୂର୍ତ୍ତି |
| ఉర్దూ | پورنکی دکشنا مورتی |
| పంజాబీ | ਪੋਰੰਕਿ ਦਕ੍ਸ਼ਿਣਾ ਮੂਰਤੀ |
| సంస్కృతం | पोरङ्कि दक्षिणा मूर्ति |
| ఫ్రెంచి | PAURANKI DAKSHINA MOURT |

## ఇతర ఉపయుక్త గ్రంథాలు

- రాజాజీ రామాయణం - చక్రవర్తి రాజగోపాలాచారి
- రాజాజీ మహాభారతం - చక్రవర్తి రాజగోపాలాచారి
- రాజాజీ మహాభాగవతం - చక్రవర్తి రాజగోపాలాచారి
- వ్యాకరణాదర్శము - శ్రీ బూరుగల గోపాలకృష్ణమూర్తి
- వ్యాసమంజూష - డా॥ డి. సాంబమూర్తి
- వ్యాకరణ మంజూష - డా॥ డి. సాంబమూర్తి
- పదామృతము - డా॥ ఓ.ఎ. శర్మ
- ఎన్‌సైక్లోపెడిక్ మెడికల్ డిక్షనరీ (ఇంగ్లీష్-ఇంగ్లీష్-తెలుగు) - డా॥ ఓ.ఎ. శర్మ
- తెలుగు బోధన పద్ధతులు - డా॥ డి. సాంబమూర్తి
- పాఠశాల పాలన, నిర్వహణ, విద్యా ప్రణాళిక, విద్యా సాంకేతికత - డా॥ కె. లక్ష్మీనరసమ్మ
- అనియత విద్య - శ్రీ పి. రామచంద్ర పిళ్ళై
- జనాభా విద్య - శ్రీ పి. రామచంద్ర పిళ్ళై
- వయోజన విద్య - నిరంతర విద్య - డా॥ డి. సాంబమూర్తి



**నీల్‌కమల్ పబ్లికేషన్స్ ప్రై. లిమిటెడ్.**
ఎడ్యుకేషనల్ పబ్లిషర్స్ (ఎక్స్‌పోర్టర్స్ & ఇంపోర్టర్స్)
సుల్తాన్ బజార్, హైదరాబాద్ - 500 001. (ఆం.ప్ర.)
ఫోన్స్ : 591665, 4611674, 4614855.

NEELKAMAL HOUSE OF WISDOM & KNOWLEDGE